శ్రీ

# ఆచంట రామేశ్వర శతకము.



[illegible] శాస్త్రి గారిచే

సకల జగద్విఖ్యాత జనోపయోగకర మహనీయం

రచియింపఁబడి,



వారి కొమార్తెలు, సుబ్బారాయుడు గారి సతీమణి, వల్లమ్మగారిచే

స్వీయ ముద్రణము గావింపఁబడి, ప్రచురింపఁబడినది.


ఆచంట

పశ్చిమ గోదావరి జిల్లా.

1956

ప్రతులు 1000



నేషనల్ ప్రింటర్సు, మారుటేరు.

శ్రీ

# ఆచంట రామేశ్వర శతకము.



మేకా బాపన్నగారిచే

సకల భగవద్భక్త జనోపయోగకర మగునటుల

రచియింపఁబడి,



వారి పౌత్రిలు, సుబ్బారాయుడు గారి సతీమణి, పల్లమ్మగారిచే

తృతీయముద్రణము గావింపఁబడి, ప్రచురింపఁబడినది.

ఆచంట

పశ్చిమ గోదావరి జిల్లా.

**1956**

ప్రతులు 1000



నేషనల్ ప్రింటర్సు, మారుటేరు.

# — గ్రంథకర్త వంశావళి —



మేకా నాగయ్య
'పండిత' బాపన్న.
అబ్బాయి.
రామకృష్ణమ్మ.
వెంకట సుబ్బారాయుడు.
నాగయ్య.
తిరపయ్య.
(ద్వితీయ ముద్రణ చేయించిరి)
బాపన్న.
వీరన్న.
సుబ్బారాయుడు.
అచ్యుతరామయ్య.
రామకృష్ణయ్య.
వీరి సతీమణి, పల్లమ్మగారు.
(తృతీయ ముద్రణమును వేయించిరి)

# పరిచయము.



శ్రీలకావాసమై, సకల భక్త జనావళి కాలవాలమై, వివిధ విద్యా విశారదుల కిరవై, అర్థిజన రక్షాదక్షులైన శ్రీఉమా రామేశ్వరస్వామి, శ్రీ మదన గోపాలస్వామి వారలచే పరిరక్షితంబై, విశ్వ విఖ్యాతి నందిన మార్తాండపురమను నామాంతరముగల ఆచంటపురవరము వశిష్ఠగోదావరికి పశ్చిమ పార్శ్వంబున నొప్పారుచున్నది. "ఒడయనంబి" యను భక్త శిఖామణి 'పరమనాచి' యను వారాంగన కుచంబును అర్ధరాత్రింబున "శివలింగ"ముగ భావనచేసి. యర్చించుచుపట్టున నాపె మేల్కాని. పరిహసింప. నాత డప్పరమేశ్వరుని దండక స్తోత్రాదుల బ్రస్తుతింప, భక్తవత్సలుండగు మహేశ్వరుఁడు సాక్షాత్కరించి యమ్మిథునమునకు సాయుజ్య సౌఖ్యంబు లొసంగె. సంత, 'చంట' వెలసి పల్కుటంజేసి "ఆచంట" యను నామ మన్వర్థంబయ్యె ననునది స్థలపురాణాంశము.

అట్టి ఆచంట పురమున బ్రసిద్ధిగన్న కమ్మ వంశంబునందు మేకా నాగయ్య చల్లమాంబల గర్భశుక్తిముక్తాఫలంబైన "బాపన" యను పరమ భాగవతోత్తముఁడు సకల భక్త జనోపయోగ కరంబగు నటుల భక్తి రస ప్రధానముగ శ్రీరామేశ్వర, మదనగోపాల శతకముల రచించి. "పండిత బాపన" యను యశమంది పరమ పదవినందెను.

తదనంతరము వారి సోదరుని పుత్రులు, నాగన్న· తిరపయ్య యను వారలు ఆ శతకములను 1908 సం॥రంలో ముద్రణచేయించిరి. అప్రతులు నే డెచ్చటనోగాని కానరాకుంటచే అనేకుల ప్రోద్బలమున "పండిత బాపన్న" గారి పౌత్రులు, వెంకటసుబ్బారాయుడుగారి పుత్రులు, సుబ్బారాముడుగారు వీనిని పునర్ముద్రణ చేయింప నుత్సహించిరి. కాని వారి కాలమున సంపూర్తి గావింప బడనందున, వారి సతీమణి పల్లమ్మగారు భక్తితో పై శతకముల నచ్చొత్తించి, ప్రకటించి యున్నారు. భగవద్భక్తులగు వీరికి సకలేప్సితంబుల గూర్చి, పరమేశ్వరుఁ డనిశంబు సంరక్షించుగాత మని మా విశ్వాసము.

పెనుగొండ,<br>
10-7-1956

ఇట్లు.<br>
కోట నరసింహామూర్తి.<br>
గౌ॥ సంపాదకుడు: 'సర్వోదయ'

# అ భి ప్రా య ము.



శ్రీ ఆచంట రామేశ్వర శతకమును, శ్రీ మదనగోపాల శతకముల నచ్చటచ్చటఁ జదివినాడను. వీనియందుఁ గవియొక్క రచనా వైశిష్ట్యము పాండిత్యముతోఁ బ్రౌఢమై యుండినట్లు చూచినంతనే దృగ్గోచరముగా గలదు. ఈ శతక రచయిత యాంధ్ర సంస్కృతములం దసమాన పండితుడును, గవియునై యుండుటయే దీనికిఁ గారణము.

ఈ కవి శతకద్వయమందును శివ కేశవుల సీస పద్య సుమములచే నర్చించి వారియందు సమాన భక్తి భావమును ప్రదర్శించినాడు. ఇందు శ్రీ ఆచంట రామేశ్వర శతకము క్రీ. శ. 1850 లోను, క్రీ. శ. 1863 లో శ్రీ మదన గోపాల శతకమును రచియించినట్లు కవి చెప్పికొనియుండెను. ఈ శతకముల యందలి పద్యములు స్తోత్రోపయోగములై, శ్రావ్యములును నర్థగాంభీర్యమునుఁ గల్గి యున్నవి.

ప్రాచీనకవుల వలెనే యీ కవియు, ఇష్టదేవతా ప్రార్థనాదులఁ జేసి యుండెను. ఇతడు మేకావంశమున నాగయ్య చల్లమాంబలకు జ్యేష్ఠపుత్రుడైనట్లు వ్రాసికొని యుండెను. కవియు, భక్తశిఖామణియు నగు నీత ని కోరిక కుఁ దగినట్లీగ్రంథము మూడవ ముద్రణమును పొందుచుండుఁ జూడనిది సర్వవ్యాప్తినొంది భక్తుల కుపయోగ్యమై, చిరయశము నార్జించు ననుటలో సందియములేదు. భక్తిప్రబోధ శతకములలో నీ రెండును చిరకీర్తినొందు గాక!

ఇట్లు.

ఆచంట, 15-7-56

గోదావరి వల్లభేశ్వరశర్మ,
సీనియర్ తెలుగుపండితులు, బోర్డుహైస్కూలు.

సీ॥ చతురబ్ధి వలయిత క్ష్మాతలంబున పేరు
వడసిన యాచంట వరపురంబు,
ఆపురం బిందిర కాపురం బనదగు
పంటపాడికి భువి జంటలేక,
రామలింగేశ్వర నామంబుచే నుండు
ప్రమథ గణాళితో భర్గుఁడిచట,
శ్రీరామలింగేశు సేవాళిలో నొకఁడనఁ
పరమ ప్రసిద్ధుండు- భవ్యయశుఁడు,
విష్ణు పాదోద్భవ విఖ్యాత కులజుండు,
ఘనుఁడు, మేకావంశ వనధి చంద్రుఁ
డలఘు భక్తుఁడు, బాప నాహ్వాయ శుభగుండు,
సర్వ పురాణ షట్ శాస్త్ర విదుఁడు,
వేద రహస్యాళి విస్తార విశదుండు,
సత్వ గుణైశ్వర్య శర్వసఖుఁడు,
రామలింగేశ్వర నామాంకితంబుగ,
భాసిల్లు మదన గోపాలు పేర,
శతకముల్ రెండును చయ్యన రచియించి,
పరమపదించెను ధరణిలోన,
ఇతని తమ్ముఁడు రామకృష్ణుండు, హరిపద
భక్తి వర్ధిష్ణుండు, భవ్యుఁడరయ,
పుత్రద్వయంబును బొల్పొందగాంచెను,
సత్య వాక్శోభిత సరసులనఁగ,
నాగన్న, తిరపయ్య, నామధేయులు, ధర్మ
కార్యాను కూలురు, కారుణికులు,
ఆ॥వె॥ పితృ పితృవ్య కీర్తి పెంపొందగా జేసి,
పితృ ఋణమును దీర్చి, పేరుగాంచ,
వీని నచ్చునొత్తి వెలయింపజేసిరి,
ధరణి నర్క చంద్ర తారకముగ॥

శ్రీ ర స్తు!





# ఆచంట రామేశ్వర శతకము.



శ్రీశ పులోమజా చిత్తేశ వాగీశ
ముఖ మఖాశ స్తవ ముదిత హృదయ
దయమాన నయన సుధాతార దరహీర
హార నీహార ప్రకార కాయ!
కాయజాపత్తి సంధాయక లోచన
భవ బంధ మోచన పాపహరణ!
రణరంగ విజయ పారాయణ బాణాగ్ని
నిర్దగ్ధ పురహార నీల కంఠ!

గీ॥ కంఠ కలితాహి భూషణ కాలకాల!
కాలకాతర భూసుర బాల పాల!
భూతలోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ త్రసదమరాభయ దాన దక్షిణ కర
కరగత గైరిక గ్రావ రాజ
రాజచూడద్యుతి రమ్య జటాభోగ
భోగ నిర్భర తర పూర్ణ చిత్త
చిత్తజనాశాగ్ని చిత్ర రుగ్దృగ్వామ
వామామణిశ్లిష్ట వామ భాగ
భాగధేయ త్యాగ ప్రముదితాశాపాల
పాలనా కలనాతివేల భావ

గీ॥ భావ భవకోటి భాస్వర ప్రౌఢ రూప
రూపవందిత హృద్గిరి భూప భూత
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ వినుమదంతర్వాణి వినుత గుణ శ్రేణి
పరిచిత గీర్వాణి పద్మపాణి!
స్వీకృతోరు కృపాణి సేవమానేంద్రాణి,
దీన శుభక్షోణి దృగ్జితైణి!
పులిననిభ శ్రోణి కలహంస కల్యాణి
పరమకల్యాణి షట్పాద వేణి!
కలిత కామద్రోణి కైవల్యనిశ్రేణి
మహానీంద్ర నిర్వాణి మంజు వాణి!

గీ॥ వాణి విధిరాణి తుష్ట శర్వాణి నాదు
కబ్బ మబ్బురముగ జేయ గడఁగు గాత!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ రాజకళా మౌళి రక్షిత దీనాళి
దురిత తమోహేళి తుష్టకాళి
మహనీయ తర దేహు మంజుల రుచి బాహు
వీరరసోత్సాహు వీతమోహు
సమద మూషక సాది సాధుజనామోది
వితత విద్యాపాది వేదవేది
భూరిభూమాసాద్యు సూరి హృత్సంవాద్యు
విఘ్న రుజావైద్యు విశ్వ వేద్యు
గీ॥ నేకదంతుని దాంతుని వీక మది ను
తింతు నిర్విఘ్న పరిసమాప్తిని దలంచి
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ వర కవిత్వశ్లోకు వాల్మీకునకు మ్రొక్కి,
మాఘు నిర్మథితాఘు మది నుతించి,
కవితా రసోల్లాసు కాళిదాసు దలంచి,
చారు వాక్సారు మయూరు నెంచి,
ఆంధ్ర భాషాచార్యు నన్నపార్యు గణించి,
యోజ దిక్కనసోమయాజి, యాది
యైన కవులకు జోహారులు గావించి,
యద్యతన కవుల నాత్మ దలచి,
గీ॥ కుకవు లెద నన్నుపేక్షింప గోరి వారి
పొలుపు దలపకుపేక్షింప బూనినాడ,
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ గణ యతి ప్రాస లక్షణములేమి యెఱుంగ,
శబ్దార్థ గుణరీతి శయ్య లెఱుగ,
నాటకాలంకార చాటు ప్రబంధముల్
చతురత మీఱంగ చదువలేదు,
శతకమొక్కటి భవచ్చరణాపచితికి నే
శతపత్ర మాలగా మతిఁదనర్ప
దలఁచితి నిందుకు ధైర్య మెద్దియు లేదు
నీ కటాక్షావాప్తి నియతి దక్క,
గీ॥ నిర్వహించిన మానిన నీడె భరము
తండ్రులవిగావె? బాలుర తప్పిదములు,
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ క్రొమ్ముడి ముడిచిన క్రొవ్విరి సోనల
సొగయు తేటుల మ్రోత సుతిగ కల్మి
వాల్గంటి కోడలు వలిగుబ్బ గుబ్బల
బండిన మణిపీణ పద్మరాగ
కంకణ ఝణ ఝణత్కార పాణి ధరించి
మీటఁ దంత్రీ స్వర మేళమాధు
రీసాధు రీతుల రేకజోక సరస
కవులకు చెవులకు చవులు దవుల
గీ॥ దగు రసస్ఫూర్తి నా కవితకు నొసంగు
తాపసత్రాత సకల విద్యా ప్రదాత,
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ భవ మహాంబుధి పోత! పాపాంబు భృద్వాత!
సద్గుణోపేత! వాచామతీత!
భూత లోకోత్పాత! దుష్టాగ్ని జీమూత!
భక్త కామితజాత! పారిజాత!
కలి హిమఖద్యోత! కాతర యమదూత!
గణ పరివృఢతాత! కామజేత!
రక్షితార్త వ్రాత! రణజయ విఖ్యాత!
దీనావనాకూత! ద్రుహిణ సూత!

గీ॥ అద్రిజా చిత్త కాసార హంసపోత!
నర సురాసుర కిన్నర నాగగీత!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ కాంచనాచలచాప! ఖండిత మునిశాప!
దందశూక కలాప! దళితపాప!
కరుణారసనదీప! కంజలోచనరోప!
మునిమనో గృహదీప! మోహలోప!
కలితాగమాలాప! కామ హృద్దురవాప!
నందితాచల భూప! నాదరూప;
శమితాసురాటోప! శమ ధన నిక్షేప!
సింధురాజవనీప; శ్రితసునీప!

గీ॥ నామ జపశోషితానమన్నరక కూప!
అంఘ్రి విక్షేప నిహతాంత కావలేప!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ శయసంగత కురంగ! చంద్రసూర్య రథాంగ!
విశత దయాపాంగ! విశ్వసంగ!
మన్మథ మదభంగ! మథితారి మాతంగ
సన్మనోంబుజ భృంగ! సత్యరంగ!
వలయీకృత భుజంగ! కలిత నంది తురంగ!
నీరరాశి నిషంగ! నిర్మలాంగ!
శేఖర శశిలింగ! శిర గాంగ తరంగ!
కరుణాంతరంగ! సుఖానుషంగ!
గీ॥ మత్త దుర్వృత్త దైత్య తమః పతంగ!
అఖిల గీర్వాణ నివహావ నాతిభంగ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ శారదాంబుదగాత్ర! చతురాననస్తోత్ర!
శ్రితజన వశచైత్ర! శ్రీదమిత్ర!
భవవిమోచన సూత్ర! భక్తేప్సితక్షేత్ర!
దుష్ట దానవ జైత్ర! సృష్టిచైత్ర!
పాలిత ద్విజపుత్ర! పావన చారిత్ర!
వృజినాతపచ్ఛత్ర! వేదపత్ర!
కామునకీకృత గోత్ర! కామిత ఫలసత్ర!
శుచ్యబ్జ రవి నేత్ర! శోకతోత్ర!
గీ॥ కమల సంభవ జనక సత్కంకపత్ర!
ఆపదార్ణవ తరణైక యానపాత్ర!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ మహిత తాపస బృంద మానసాబ్జ మిళింద!
వినత శతానంద! విశ్వతుంద!
కలిత కామితసుంద కరుణాలతాకంద!
నందిత ముచికుంద నతసునంద!
వికృత జాతస్పంద వితత దయామంద!
నిభృత మహానంద నిహితమంద!
కాయరుగ్జిత కుంద కలిత శైలాళింద!
గళ తిరస్కృతకంద గళితనింద!
గీ॥ చారుతర పద పరిభవితారవింద!
అనవరత చామరాంచిత హస్తనంద!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ రజత భూధర ధామ రంజితార్తస్తోమ!
ఫాలదృగ్జిత కామ పఠితసామ!
పతిత పావననామ భక్త రక్షణ కామ!
మస్తక గత సోమ మహిత భామ,
వినత భార్గవరామ విజితదైత్యస్తోమ!
శ్రీకల్పకారామ చింత్యభూమ!
గజదానవ విరామ కరుణాత్త సుత్రామ!
సారమహోద్దామ సత్యసీమ!
గీ॥ సూరి జన నుత గుణధామ సురలలామ!
చతుర సంగ్రామ గర్వితా శర విరామ!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ సురవార పరివార శోభమానాకార!
సకల లోకాధార సద్విహార!
లాస్యమాన కుమార లాస్యలోల శరీర!
దుష్ట దైత్య విదార దురితదూర!
వందారు మందార వారిధి గంభీర!
విహృత దుర్జనవార వేదసార!
యోగి మానస చోర భోగినాయకహార!
నిటల దృగ్జిత మార సర్వాకార!
గీ॥ మార శతకోటి సుకుమార మేరుధీర!
కలుష దుర్దమసంసార ఘనసమీర!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ నిష్కామ సన్నాహ నిభృత మనోత్సాహ!
సర్ప భూషిత బాహ శమ్యదూహ!
గంగాపరీవాహ కలిత జటావ్యూహ!
వృష పరివృఢ వాహ విగతమోహ!
ఫాలదృక్శుచి దాహ భస్మితాంగజ దేహ!
కామిత సందోహ కామదోహ!
హిత విహంగమ వాహ హత దితిజ సమూహ!
రాజతాచల గేహ రమ్యదేహ!
గీ॥ వరగళద్యుతి నిర్జిత వారివాహ!
ఉద్యతానంద గిరితనయోపగూహ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ జన్మ జరాత్యాగ జగదవనోద్యోగ!
వినత మహారాగ విదితయోగ!
వందారు కల్పాగ వనజారి సంయోగ!
ఘన జటాభాగ సంకలితభోగ!
శ్రిత సుధాశనపూగ హతదైత్య పున్నాగ!
మన్మథ జయవేగ మథితయాగ!
పరిహృత మునిరోగ దురితభార వియోగ!
వరవర్ణినీ యోగ వామభాగ!
గీ॥ పావకాక్షి రుచిస్ఫీత ఫాలభాగ!
భూషణీకృత సర్వాంగ పూర్ణనాగ!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ గోపాయితమఘూద కుటిల దైత్య విభేద!
సాధు జనామోద సత్యవాద!
దేవ పూజితపాద! దేశకానోహ్లాద!
సత్కీర్తి సంపాద క్షుపితభేద!
నూపురీకృత వేద పాప సముత్పాద!
విహృత సజ్జన ఖేద విదితనాద!
ఉపనిషత్సంవాద చపల చురుపసాద!
దుష్టావసాద మేదుర వినోద!
గీ॥ సూరి సముదయ రక్షణ సుప్రసాద!
పరిహృతాపన్న జన పునర్భవ విషాద!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ శర్వ శంకర భవ సర్వేశ సర్వజ్ఞ!
శ్రీకంఠ శితికంఠ శివ గిరీశ!
భూతేశ మృడహర పురహర ఫాలాక్ష!
నీలకంధ మహేశ కాలకాల!
నీలలోహిత మహాకాల మహానట!
స్మరహార భర్గ పంచాస్య రుద్ర
ఈశ్వర భీమ మహేశ్వర కైలాస
వాస మృత్యుంజయ వామదేవ!
గీ॥ భూత భావన క్రీడా కిరాత యనుచు
కేరి పాడుచు నీ నామ కీర్తనములు,
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ కణ్వ మార్కండేయ గౌతమ జాబాలి,
రైభ్య శమీక దుర్వాస కచుర
కుత్స భార్గవ బక క్రోష్టి భరద్వాజ,
కశ్యప పిప్పల కౌశి కాత్రి,
చ్యవన పైలాగస్త్య శౌనక సంవర్త,
మాండవ్య రోమశ మందపాల,
వాలఖిల్య వసిష్ఠ వామదేవ సుకేవ
శరభంగ నారద హారితులైన
గీ॥ నీ గుణంబులు వర్ణింప నేర రన్న
నల్ప మతులగు మాబోంట్ల కలవి యగునె?
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ రావె పుంగవ వాహ రావె మంగళదేహ!
రావె నిర్గతమోహ రా నిరీహ!
రావె మహాకాల రావె గౌరీలోల!
రావె లోచనపాల రాసుశీల!
రావె వియత్కేశ రావె మార వినాశ!
రావె సురాధీశ రా గిరీశ!
రావె మహాదేవ రావె మహద్భావ!
రావె నమద్దేవ రా సుభావ!
గీ॥ రావె శ్రీకంఠ శితికంఠ రావె యనుచు,
తలచి పిలచిన రావిదే తగునె నీకు,
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ శ్రీకంఠ నీ గుణ చింతనామృతముచే
మరిగి చొక్కనయట్టి మనము మనము!
సర్వజ్ఞ నీ పాద జలజ సమర్చన
కలితమై తనరెడి కరము కరము!
క్రీడా కిరాత నీ కింకర పదరజ
శ్చిహ్నితంబై నట్టి శిరము శిరము!
వైకుంఠ మిత్ర నీ వర చరిత్ర స్తోత్ర
స్థిర భక్తి బరగెడి జిహ్వా జిహ్వా!
గీ॥ శర్వ నీ దివ్య రూపంబు సంతతంబు
నమ్మి గాంచఁగ నేర్చిన నరుఁడు నరుఁడు!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ ఓ మేరు కోదండ యో మురజిత్కాండ!
యో దయా గుణశాలి యో కపాలి!
ఓ యక్షరాణ్మిత్ర యో యక్షరాట్పుత్ర!
యో గజాసురవైరి యో పురారి!
ఓ హిమాద్రి విహార యో యహి కేయూర!
యో సురద్రుమ గేహ యో నిరీహ!
ఓ ఫాలలోచన యో పాపమోచన!
యో మదన వినాశ యో గిరీశ!
గీ॥ ఓ సుధీభాగధేయ యో యోగిగేయ!
ఓ మహానట యో యీశ యో మహేశ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ మహిత ప్రసన్న కోమల మంగళ స్మిత
లలితాననేందు మండలము తోడ,
మునిజన మానస వనరుహ కర్ణికా
చంచరీక పదాంబుజముల తోడ,
గంగా తరంగ భుజంగ కురంగాంక
సంగ జటాల మస్తకము తోడ,
మస్తకోపరి శస్త మణిగణాస్తి వితాన
రాజితోరగ రాజ రాజి తోడ,
గీ॥ వెలయు నీ దివ్య రూపంబు నిలుపు నాదు
చిత్తమందు దయాలత చిగురులొత్త!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ ఓ భక్త మందార యో భద్ర గుణవార!
యో భోగి భూష యో యోగి పోష!
ఓ పుంగవ తురంగ యో పురాసుర భంగ
యో ముని వనచైత్ర యో పవిత్ర!
ఓ విశ్వ భావన యో విశ్వ పావన
యో సురాసుర భావ్య యో సుసేవ్య!
ఓ విశ్వమంగళ యో విషాంచద్గళ
యో మహా దేవేశ యో మహేశ!
గీ॥ రావె! రక్షింపవే నన్ను రాజమౌళి!
వేరె రక్షింప నీకంటె వేల్పు లేరె?
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ మృత్యు భీతిని నిన్ను మృడ కావు మని వేడ
కరుణ మార్కండేయు గాచినావు!
విషవహ్ని కీలల వేగి సురాసురల్
శివ బ్రోవు మనగ రక్షించినావు!
నరు డరి జయకాంక్ష హర యని నినువేడ
మెచ్చి పాశుపతాస్త్ర మిచ్చినావు!
శ్రీదుడు నిను జేరి శితికంఠ యనిమ్రొక్క
సఖ్య సమున్నతి జరిపినావు!
గీ॥ గాన దీనావళీ కామధేను వనగ
నలరు నిన్గొల్వ కోరిక లబ్బ టరుదె?
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ! 25

సీ॥ రజత భూధర ధామ రక్షింపుమని మ్రొక్క-
రాకున్న పార్వతీ రమణి యాన,
గజదానవాంతక కావుమంచును వేడ,
బలుకకున్నను వీరభద్రు నాన,
దక్షాధ్వరధ్వంస దయజూడు మనిపిల్వ
నరయకున్నను వినాయకుని యాన,
ఖండేందు శేఖర కరుణింపవేయన్న
తలచకున్నను శక్తిధరుని యాన,
గీ॥ రాజరాజాప్త రమ్మన్న రాకయున్న
భైరవుని యాన, శంకర! ప్రమథనాథ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ నీ కీర్తనల్ వించు నీ కథల్ పాడుచు
నీ దాస జన గోష్ఠి నెగడుచుండు
భూత దయాళులౌ పురుషుల మనమను
ప్రవిమలోదకముల బ్రతిఫలింపు
వధ్వర జప తపో ధ్యయనాది క్రియల ని
ష్ణాతులౌ నీ దాస జనుల గోష్ఠి
నెరి యెరుంగని కర్మ నిరతుల హృత్సన్ని
హితుండవయ్యును దోచ వతుల మహాను
గీ॥ తత మహానంద సాగరాంతర్నిమగ్న
మాన మానస మానవ మాననీయ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ చెన్నగు మొగమున వెన్నెల వెదజల్లు
నవ్వుతో జాబిల్లి పువ్వుతోడ,
ఎద్ద వేలుపు పుత్రి పేరుల జెన్నారు
నురముతో జడలల్లు శిరముతోడ,
పసిమిరంగు జెలంగు పసమీరు పులితోలు
వలువతో సామేని చెలువతోడ,
తలగ్రాలు రతనాల తళ్కుల పాపరా
పేరుతో మెడకప్పు తీరుతోడ,
గీ॥ నీవు విచ్చేసి దయనేడు గావకున్న
ఎవరి వాడను నేసాదు నెంచిచూడ,
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ వాకిటి కావలి వాని జేయగనేర,
కోదండమున నిన్ను గొట్టనేర,
రాళ్లచే రువ్వుచు రవ్వ సేయగనేర,
కుంటెనగా బంప గోరనేర,
బుడుత కూరగ జేసి బువ్వ బెట్టగనేర,
చెలగి కనుల బూజ సేయనేర,
మేను సగంబిచ్చి మెప్పించగా నేర,
యెంగిలి వస్తువు లియ్యనేర,
గీ॥ నివ్వటిలు నెవ్వచే నిన్ను నే దలంప,
గూయి వినవైతి వికనేమి సేయువాడ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ నా తల్లి భుజగాధి నాథకేయూరుండు,
నా తండ్రి కైలాస నాయకుండు,
నా సోదరుడు శీత నగరాడ్వివాహరుండు,
నా గురుం డంగజ నాశకుండు,
నా సఖుం డమరేంద్ర నందన శరణుండు,
నా బాంధవుడు సన్మనః ప్రియుండు,
నా స్వామి శుచిచంద్ర నలినాప్త నేత్రుండు,
నా దిక్కు నమ్రమ జనావనుండు,
గీ॥ అనుచు మదిలోన నిన్నెంచి యనుదినంబు,
సేవ జేసెద నన్నేలు చిత్తజారి!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ కాలకింకరు లుగ్ర ఖడ్గ గదా కుంత
శూల ముద్గర భిండి వాల పాశ
పాణులై సంవర్త పవి ఘోష నిర్ఘోష
భీషణ భాషణా భీలకీల
గ్రాల నా మ్రోల సురాసుర కిన్నరుల్
వీరభద్ర కుమార విఘ్ననాథ
భైరవుల్ ప్రమథులు బలిసి చుట్టును గొల్వ
నగరాజ తనయతో నందినెక్కి
గీ॥ నీవు ప్రత్యక్షముగ వచ్చి, నిలిచి వత్స!
వలదు వెరవంగ నని నన్ను బలుకుమయ్య!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ సర్వేశ్వరుండవు సర్వజ్ఞమూర్తివి,
సర్వకారణుడవు సర్వగుడవు,
సర్వంబు నీలోన సంపన్నమైయుండు,
సర్వంబులో క్రీడ సలుపుదీవు,
సర్వ సముద్భవ సర్వ సంరక్షణ,
సర్వ నాశనకర చణుడవీవు,
సర్వ రూపకుడవు సర్వ వేద్యుండవు,
సర్వ దృక్కువు సర్వ సాక్షివీవు,
గీ॥ కాన ననుగావ పరులకు గలదె గరజు?
గలయ బచ్చల కేలయ్య కంద మరద?
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ నిష్కామ ధర్ములై నీ పాద రాజీవ
సేవాసమాసక్త చిత్తులైన
భక్తులందు ప్రసన్న భాంధవుండగు రీతి
శుద్ధసత్వ గుణోప శోభితులును
మహితానుభావులు మహనీయులగు సుప
ర్వాలయందు సద్బాంధవుండవుగావు,
వీక పెందము కామ నైకతానంబగు
నేని సురాసుర మాననీయ!
గీ॥ అయ్య దయచేసి మీ చరణారవింద
సేవపై చిత్త మిగురొత్త జేయుమయ్య!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ జయజయ గౌరీశ! జయజయ సర్వేశ!
జయజయ విశ్వేశ! జయ గిరీశ!
జయజయ ధవళాంగ! జయజయోక్ష తురంగ!
జయజ యాంగజ భంగ! జయవిసంగ!
జయజ యాహి విభూష! జయజ యాశ్రిత పోష!
జయజ యామృత భాష! జయ సువేష!
జయజ యామర రక్ష! జయజ యాగమ వక్ష!
జయజ యాధ్వర శిక్ష! జయ సదీక్ష!
గీ॥ జయజ యాపన్న రక్షణాక్షయ సుదీక్ష!
జయజయత్ర్యక్ష మోక్షద చతురవీక్ష!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ వసుధా శతాంగాయ! వనధి నిషంగాయ!
దానవ భంగాయ తే నమోస్తు!
సురగిరి చాపాయ! గరుడాశ్వరోపాయ!
దివ్యస్వరూపాయ! తే నమోస్తు!
కరుణాలవాలాయ! గజచర్మ చేలాయ!
దీనాళి పాలాయ! తే నమోస్తు!
నిగమాంత గణ్యాయ! నిభృత లావణ్యాయ!
త్రిజగద్వరేణ్యాయ! తే నమోస్తు!
గీ॥ దినకరాబ్జ రథాంగాయ! తే నమోస్తు!
అనుచు నిరతంబు నీకు జోహారు సేతు!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ దండంబు కుండలి కుండలాంచద్గాఢ
దండంబు మేరు కోదండ దండ!
దండంబు బ్రహ్మాండ మండితోరుపిచండ
దండంబు భండ నోద్దాఢ దండ!
దండంబు శుండాల దనుజ ఖండన చండ
దండంబు దండ భృద్దళన కాండ!
దండంబు తాండవ దళిత దిగ్వేదండ
దండంబు దండిత దైత్యకాండ!
గీ॥ దండ మాఖండలాండ జాతాశ్వ పుండ
రీక భవ ముఖ మఖ భుగనీక వినుత!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ ముని జనావన శీల! ధనద సఖ్య విలోల!
కరధృత శూల! మంగళము నీకు!
సనకాది మునిజాల! సన్నుత గుణలీల!
కరుణాలవాల! మంగళము నీకు!
త్రిభువన జంఘాల! దివ్యకీర్తి విశాల!
కంకాలమాల! మంగళము నీకు!
కుత్కీల వరశైల! ఘోరదైత్య విఫాల!
గళజితనీల మంగళము నీకు!
గీ॥ కాళి కాంచిత ఖేల మంగళము నీకు!
కామితామరసాల! మంగళము నీకు!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ జయ విజయీభవ! శమధన నిక్షేప!
జయ విజయీభవ! శాంతరూప!
జయ విజయీభవ! శమన నిర్వాపణ!
జయ విజయీభవ! శైలశరణ!
జయ విజయీభవ! చక్రాంగ హయసూత!
జయ విజయీభవ! సారభూత!
జయ విజయీభవ! సర్పరాజ విభూష!
జయ విజయీభవ! సత్యభాష!
గీ॥ యనుచు గీర్తింతు నిను భక్తి ననుదినంబు
దీన సంతాన సంతాన దృగ్వితాన!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ ముని మనశ్చాతక ఘన కరుణారస
నిమ్నగా వల్లభ నీకు శరణు!
వట మహీరుహమూల వాసవాసవ వంద్య
నీరజాతప్రియ నీకు శరణు!
పాపశిలోచ్చయ భంజన పవిధాన
నీలలోహిత శర్వ నీకు శరణు!
దైవమానస హంస దేవదేవ వతంస
నీలకంఠ మహేశ నీకు శరణు!
గీ॥ అనుచు నీ పద యుగమున కనుదినంబు
దండ మొనరింతు నా మది నుండు కొఱకు!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ పాహిమాం మహిరాజ బంధకంకణబాహా!
పాహిమామామాహృత భవ విమోహా!
పాహిమా మంగజ భస్మ భూషితకాయ
పాహిమా మాపన్న భాగధేయ!
పాహిమా మాశ్లిష్ట పార్వతీ రుచిరాంగ!
పాహిమా మానత పాప భంగ!
పాహిమా మమరేంద్ర పరిచిత పదపద్మ!
పాహిమా మాశ్రిత భాగ్య పద్మ!
గీ॥ యనుచు భజియింతు నా మది నహరహంబు!
ఘన దయాపాంగమున నన్ను గాంచుమయ్య!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ వందన మిందిరా వల్లభ లోచన
పంకజ పూజిత పాద నీకు!
వందన మిందురుగ్బృంద విభాసిత
ఘన జటా పటల వికాస నీకు!
వందన మరవింద చందన మందార
హార నీహార శరీర నీకు!
వందన మిందీవ రేందిందిరాసీక
కాంతి మేచక రుచి కంఠ నీకు!
గీ॥ వందనం బబ్జసంభవ వరద నీకు!
వందనం బింద్ర ముఖసుర వరద నీకు!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ చిన్ని బసవెన్నెన్ని జిల్లు శాల్వు లొసంగె
గోరక్షుఁ డేయగ్రహారమిచ్చె?
మణివాలు మాచయ్య మణుల నెన్నిటినిచ్చె?
బసవన్న యేమేమి భాగ్యమిచ్చె?
మరుశంకరుండెన్ని మదగజంబుల నిచ్చె?
కిన్నరుం డెన్నెన్ని హొన్నులిచ్చె?
చిక్కన్న యేమేమి చిత్ర వస్తువు లిచ్చె?
కన్నప్ప యేమేమి కట్నమిచ్చె?
గీ॥ నేను నీకేమి యియ్యంగ నేరనైతి!
వలదు చలమిక నన్నేలు వామదేవ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ చంద్ర సూర్య గ్రహ చపలాభ నీరద
పవిఘోష జిష్ణు చాపములు నీవ!
అజ హరి దిక్పాల కాదిత్య వసురుద్ర
గరుడ గంధర్వ కిన్నరులు నీవ!
నదనదీ ద్వీప వనధి శైల కానన
సాల వల్లి నికుంజములు నీవ!
పశు పక్షి కీటక పన్నగ క్రిమి నర
స్త్రీ పున్న పుంసక తిములు నీవ!
గీ॥ జపతపోవ్రత దాన యజ్ఞములు నీవ!
మంత్రశాస్త్ర పురాణాగమములు నీవ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ సిగమీఁద చెల్వొందు తొగవిందు గలవాని
పులితోలు సాలు పైఁ బూనువాని,
సామేన నిరవొంచు చాన గల్గిన వాని
కేల ముమ్మొనవాలు గ్రాలువాని,
చిల్వరా సొమ్ముల జెలగు చేతులవాని
యెదనల్వ పునుక పేర్లెసగువాని,
నింగివాక కరళ్ళెసంగిన తలవాని
పొలదిండి మూకల గలచువాని,
గీ॥ వేలుపుల చాలు నేలంగ జాలువాని,
కన్ను లలరంగ నెన్నడు గాంతు నిన్ను!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ మించుల జిగిమించు మేల్జడల్ మిన్నేటి
రాయంచ తెగకు లేరంగులునుప
తలమీఁద నెలకొన్న నునుసోన చాన తా
మేను జాను కోకంత మెరుగు నెట్ట
పాపరా రవణాల పసమానికపు రంగు
సెగకంటి కసటు బాయగ నొనర్ప
మెడబెడంగగు కప్పు మినుకు మేనను గ్రాలు
తోలు దువ్వల్వకు దోసు పడగ
గీ॥ నొకటి కొక్కటి మేన జెన్నొనగుచుండు,
అంద మిరువొంద బెంపొంది యలరితౌర!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ కమనీయ శుభదేహ కరుణారసోత్సాహ
సురసంఘపాల భాసుర కపోల!
నాగరాట్కేయూర నతజన మందార
దుష్టలోక విదార దురితదూర!
నందితార్తస్తోమ వందిత సుత్రామ
కైలాస వాస వికాస హాస!
మహనీయ హితవేష మంజులామృత భాష!
సర్వలోకాధార సద్విహార!
గీ॥ విశ్వ సంపాద్య నిరవద్య వేదవేద్య!
నన్ను కృప బ్రోవవే జగన్నాథ నాథ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ శబ్ద మర్థంబును సహజంబుగా నేక
మైయున్న చందంబు నచ్చుపడగ
పుష్పంబు పరిమళంబును నైజముగ నేక
మైయున్న పోలిక యూవహిల్ల
ఘన సువర్ణము వన్నెయును నొప్పుగా నేక
మైయున్న మాడ్కి పెంపంగలింప
చంద్రికయును పూర్ణ చంద్రుడు తగ నేక
మైయున్న కైవడి యందమొంద
గీ॥ కాయమును కాయ మేకంబు గాగ సఖము
కాంచు సతికిని పతివీవె గాక యెవరుడె?
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

## ఆచంట రామేశ్వరశతకము.

సీ॥ మడమల తడబడు జడపూన్కి నకనక
లాడు నెన్నడుము జవ్వాడ బెళుకు
బేడిసమీలను బెదరించు కందోయి
మిసమిస లెసగు నెన్నొసల మసలు
భసలములన నెరు లెసగ వివ్వచ్చు రా
పచ్చల బోలుపొందు బోజు బందు
లందమంద కడాని యందెల రవలి జె
న్నొంది యంచల నడ గ్రిందు పరప
గీ॥ వెన్నుడన్నగు చెన్ను నీ వెన్ను మరచి
చన్ను నిన్నెన్న నలువన్న జాలడన్న!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ అల్క హుమాగుల్కు చిల్క తేజీ నెక్కి
మావి లేజిగురాకు మావుబాకు
మొలజెక్కి యెలగోలు ముస్తాదు వస్తాదు
చందురుండామణి జంట నడువ
గోర్వంక లంచలు కోయిలల్ చిల్కలు
పావురా ల్లకుముకుల్ పౌజు గొల్వ
తమ్మిమిద్దె షమామి ధణ ధణ మ్రోయంగ
కేకీ నకీబులు కూకవేయు!
గీ॥ మించు పూముల్కు లెదనించు నించు విల్తు
చంచదాలోకనాగ్ని దహించి తౌర!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ తల నపరంజి నిద్దాతళుక్కు లొలుకు మేల్
చెక్కడపుంబుట్ట సిరులెసంగ
రంగారు బంగారు రతనాల కంకణాల్
పోచీలు సూడిగాల్ పొలుపు మీర
రంగు చెరంగు లవంగపు మొగ్గల
కంచెల బిగి చన్నుగవ దలిర్ప
ఎఱుకతవై హిమగిరికి గౌరిని గాన
నరుగు నోయార మోతని నుతింతు
గీ॥ సుందర స్మిత నిందిత చందనార
విందబృందేందు మందార కుంద కోశ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ! 50

సీ॥ గమగమ వలచు చొక్కపు తావి వీడెంపు
కావి మోవికి బలు కీవి బెనుప
మినుకు కాటుక రేక మిలమిల దెలివాలు
కన్గవ కొకవింత కాంతి నెరప
కళుక్కులీనెడి కెంపు కర్ణపూల్ ధగధగల్
తళుక్కు లేచెక్కు టద్దముల బొదల
నాణెమౌ కట్టాణి యాణిముత్తెపు నత్తు
చిరునవ్వు కొకవింత సిరి యొసంగ
గీ॥ తేట మాటల పాటల కూటవులను
మంచుమలమాలి నిన్ వలపించెనౌర!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ మొకమల్ జిలుగు దట్టి మొలగట్టి టీకైన
మోజాల్ బిగించి హోముకొని చెరుకు
సింగాణి చెంగల్వ చికిలి నేజాబూని
గందంపు గుబ్బలి గాడ్పుటాము
టేనుంగు పై నెక్కి యెదిరి హుటాహుటి
కమ్మవిల్ పాదుషా కణక మీర
కాయమ్ము గాయమ్ముగా నేయ నాయమ్మ
నాయమ్మ వనిజేర నన్నెరుంగు
గీ॥ మనుచు నిన్ గోరి వగగేరి యలరు గౌరి
దూరి సఖి జేర్చు కేళికాగార మారి!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ మీరి కాల్నడ దప్పి పారు గొజ్జంగి పూ
నీటి కాలువ లెట్లు దాటెదమ్మ!
పచ్చ కప్రపనంటి పచ్చిక ప్రపుటన
లెటుల కాలూని నీ వేగెదమ్మ!
జోరున తేనెల సోనల జడి జిను
నెలమావి గమినెట్లు నిలిచెదమ్మ!
కమ్మ దెమ్మెర దోడుగా నున్న వెన్నెల
చిచ్చులో నీ వెటు జొచ్చెదమ్మ!
గీ॥ యనుచు నాళీజనంబు నీ కై విరాళి
బాళి మీరగ కాళిని బలుకు నౌర!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ వగగుల్కు తళ్కుల వజ్రాల బేసరి
కళజెందు గుజరాతి ఖత్తు నత్తు
తళతళల్ చెక్కు టద్దము మీద నటియింప,
నీలాల బావిలీల్ నిగ్గులడర,
మొగము జాబిల్లికి నగవుటన్నువ చెన్ను
వెన్నెల లీనంగ నెన్నడుమను
మిన్నకు మొగులన మిన్కు నీలంపు రా
మొలనూలు మొల మిలమిల జెలంగ,
గీ॥ జిల్కు తేజీ వజీరు రా సిరి యనంగ
నున్న యుమ గూడి యున్న ని న్నెన్న దరమె?
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ తావి గుబుల్ కొను గోవ జవ్వాది వా
సన రవల్ మేనను జాదు కొనగ,
నీరెండ పైబర్వ నిక్కు జక్కువలన
రంగు చెంగావి జెలంగు రవిక
కప్పున గుత్తంపు గబ్బి గుబ్బ లెసంగ,
బిత్తరంపు పిసాళి బెళ్కు చూపు
తళ్కుల దమ్మి మొత్తము గ్రుమ్మరింపంగ
తొంగవిందు రాచరా జగతి మీద
గీ॥ వెలయ గూర్చుండి మణివీణ వ్రేళ్ళ మీటు
నుమ గనుంగొని యానంద మొందు దార!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ జేజేల రారాల నీ యను వేనలి
మించుల జిగి నదలించు మేను
కవకవ జక్కువ కవనవ్వు చన్గవ
కలదు లేదను నౌను కౌను వెలయ
నూడిగపుం జేడె లాడాడ దోడరా
వలిమల చూలితో గలసి వలపు
పుప్పొడి తిప్పల పొగడల నీడల
మావుల తావుల మల్లె పొదల
గీ॥ జాజి పందిళ్ల కిసిమిసి చప్పరముల
వన్నె గ్రుమ్మరు నీ హాయి యెన్నదరమె?
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ పీనౌ కస్తురి బొట్టు విన్నాణముగ దిద్ది
వలపుల గోవ జవ్వాది మేన
నలది మేలి బనార సపరంజి కమ్ముల
ఖండువా వలెవాటుగా నొనర్చి
బర్మా బుటేదారు పాగపై మగరాల
నిగరాల సరిఫేషు నీటు గుల్కు
షాల్ కలాబతుతీవ సఖలాతులాలుసా
పోసులు పదముల పూని మ్రోల
గీ॥ నల మణిగ్రీవ నలకూబరులు చెలంగి
కొల్వగ వయ్యారి వెషలితో గొనబు మీర!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ రాజంపు ముత్తెంపు రవడాల తెలిడాలు
వెలివలిపము కొక్క తెలివి యొసగ
మొగ మరవంపు కెమ్మోవి కెంపుకు పెంపు
సవరింపు మెడ బన్న సరుల సిరుల
నంద మందెడు కురువిందంపు బాదామి
దగు కుందనపు జిగి జిగిని గుల్క
శాతమన్యవ శిలా శకలమే చకచక
చ్చకలూను మేనెల్లి జమున నీన
గీ॥ కాళి గళపాళి హాళి విరాళి దాళి
తాళి ముడిగొల్పు నీబాళి దరమె పొగడ?
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ రాణ రంజిలు నపరంజి కీల్ బొమ్మల
పదము లొయ్యన నొత్త పంజరముల
పంచాస్త్ర శాస్త్రముల్ పలుకంగ చిల్కలు
పవడపు కోళ్లు హొంబట్టు పరుపు
పందిరి మంచముపై జేరి గారితో
తారుమారుల మోవి మారుపులను
తడబడు మడుపుల తమి నొడబడికల
సారె గిల్గింత గుజాగుజలను
గీ॥ సుద్దులను ముద్దులను నద్ది ప్రొద్దు పుచ్చు
జాణతనమెన్న వేనోళ్లు జాలవన్న!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ కుళితంపు కెంపుల గుల్కెడు రాగిడీ
రవ నీరు జిల్కు మెరంగు పసరు
పస్రగక్కు పక్కరా పచ్చల బిందీలు
జిగిబెళ్కు లెసగి జేజేల రాచ
సింగాణి చందంబు జెంద నొడ్డాణంపు
నిద్దా కడాని డాల్ నిగ్గు జగ్గు
క్రొమ్మించు మించుల గొనబారు చేర్చుక్క
ముత్యాల వడగళ్లు మురువు చూప
గీ॥ తురుము మబ్బుగ తొల్కరి సిరి దనర్చు
మంచుమల చూలి సామేన నుంచితౌర!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ! 60

సీ॥ పెంపురు వారంపు కెంపురారవజవ
హావణింపు జాళువా బవిర లొరయ
మొల్క నిద్దానిగ్గు ముత్తెంపు పేరులు
వలిగుల్కు గబ్బి గుబ్బల చెలంగ
ముదురు నెల సవురు కుదురగు నుదురున
చొక్కమౌ చేర్చుక్క సొగసు గల్గ
వెరవెరకు చికిలి మ్మొరుగుల శిరిచూలి
చిక్కటారి మిటారి చెన్ను మీరి
గీ॥ పెండ్లి తరి గౌరి నీ మోర పేర్మిమీర
నణకు తలనున్న సొబగెన్న నలవటన్న!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ వెడవింటి దొరదాడి వెడలంగ నూహించి
పూల కుంకుమమున బూజ సేయు
దరుచికిలీ తేజు తరుల తర్వారన
చీని కలాబతు జిల్గు వన్నె
పస నొసంగెడు కుసుంబా చీర కటిగట్టి
గంబురాజాభరా గంద మలది
సొంపగు కెంపులు సొమ్ములు మైబూని
మగరాకళా సిక మాళిగందు
గీ॥ నగజ సర్వ సుపర్వాంగనలు భజింప
బ్రౌఢి జెలొవ్వందు నీ వామ భాగమందు!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ మేల్మి జరీ బుటా మిసమిస మొగ్గల
రహిమించు పైతాణి రవిక పిక్క
టిలి వలిగూల్కు గుబ్బల చనచ్చుకలుబ్బ
బహారీగుజా జరీ పట్టె లడరు
సన్న పావడ మించు సరిమించు సరిగంచు
చీరపై మిసిమి డాల్ సొరు దేర!
బిందీలు రాగిడి బేసరి బావిలీ
లాదిగాగల నగ లందమొంద
గీ॥ వేల్పుటింతులు సీవిరుల్ వీవ నీవు
ముచ్చటింతువు సనకాది మునులతోడ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ మా రమణీమణి మణి దర్పణముజూప
వారాహి యడపంబు వన్నెదాల్ప,
కౌమారి యపరంజి కాళంజి పూనంగ,
భారతీసతి విన్నపం బొనర్ప,
పౌలోమి తగటాకు బాగా లొసంగ న
చ్చర పిండు వీవ నీ విరులు నరలు
నుంగరపుంగుర్లైసంగు వాగురుల హో
రంగున నొసల దురంగలింప,
గీ॥ వెలయు గిరికన్యతో గూడి వెండి కొండ
చరుల గ్రుమ్మరు నీ సారు సన్నుతింతు!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ గుర వేశ్రితామర తరవేథరాత్మజా
తోషితాయ భుజంగ భూషితాయ
శూలినే ఫాల దృక్కీలినే గుణసింధ
వేకనద్రుచి జిత లోకబాంధ
వేనమ విష్ణవే వినమిత జిష్ణవే
కమలారి ధారిణే కలుషహారి
ణే గో తురంగాయ నిర్మలాంగాయ న
మస్తే యటంచు నా మది భజింతు
గీ॥ కటి నికట ఘటిత వికట కరటి చర్మ
పటల పటుపట నీల రుక్పట వికాస!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ తెరగంటి తెగ పాలదిండి పిండును కడ
లి దరువ బొడము గడిది విసంబు
మెసవి లోకములకు మేలొనర్చితి వను
నుడియు పొరుని చిన్ని బుడుత కనువు
లొసగితి వనుసుద్ది వెస నాలకించె నే
మది నమ్మి నిన్ను వేడ దయ జాలి
నున్న నన్నన్న ని న్నామనగజాలను
హేతి నిర్భిన్న కుంభీంద్ర విద్వి
గీ॥ షద్వపుఃపాత నోచ్చ లత్క్ష్మా విభుగ్న
కుంభి కుంభీనసాచల కూర్మ కేశ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ తిగ ప్రోళ్లు గొట్టిన దిట్టవు మిత్తి గొం
గవు వెనకయ్య జియ్యవు వణంకు
మెట్టు కూతురు చెట్ట బట్టిన సామివి
బూచుల గమినేలు ప్రోడవంచు
మ్రొక్కి నే మది నెంచి మోడ్పుగే లొదల
గడియింప నను దయ గనవదేర?
అక్షీణ దాక్షిణ్య లక్షణ లక్షిత
కరుణాకటాక్ష వీక్షాబ్ధి సంధు
గీ॥ క్షిత సులక్ష్యేక్షుచాపక్షామ క్షేత్ర పత్ర
దంతిముఖ పూర్ణ భక్త కదంబ కాశ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ శివ! భవ! శ్రీకంఠ! శితికంఠ! స్మరహార!
పురహార! పన్నగభూషణా ప్ర
పన్నపోషణ శీత భాను బృహద్భాను
భానునేత్ర! సితాభ్ర పాండుగాత్ర!
పాహిమా మంచు నే బలవరించిన నాల
కించవు నా మొఱ గిరిజ కైన
జాలి పుట్టగ దెల్ప జాలవో నతశత
మఖముఖ సురవర మౌళి పాళి
గీ॥ తాన సంతాన మాలికా లీన రీణ
ప్రసవరస ధారణీ ధౌత పాదదేశ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ గతి నీ వటంటి, నన్ గావంగ నీ కంటె
గతియెందు నొండు నే గానసంటి,
నావంటి దీనులౌ నరుల నేలితివంటు,
నేర్పులు నేనేమి నేరనంటి,
తొంటి నీ లీలలు వింటి ముక్కంటి నన్
వంటి పీడగ జూడ వల్లదంటి,
ప్రళయ వేళాధ్వాన ద్భయదాభ్ర కాళిమ
కాయకరాళాంధకాసుర హన
గీ॥ సప్రమత్తేంద్ర శుచి యమ నైరృతాబ్ధి
నాథ వృషదశ్వ యక్షరాణ్ణాగనివేశ!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ తొగరేని నిగనిగనగు నగుమొగముల
మగువల మగరాల నగల తగటు
వగగుల్కు జిల్గు దువ్వల్వల జగజంపు
వెడవెడ నడల తత్తడుల వేడ
లేదుగా యెదనీదు పాదముల్ కుదురుకొ
ల్పుమటన్న నోహోహొ పొసగ నింత
మాత్రమైనను జేయ మదిదల్ప రాదొకో
శారీర రుచి జిత శారదాబ్జ
గీ॥ హార హీర సురాహార పూరగంధ
సార ఘనసార హిమజలాసార కాశ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ! 70

సీ॥ ఎగదిగ కన్నులు, నేనుగుతోల్వల్వ,
కాడిల్లు, బూడిద గంధ, మెద్దు
జుల్మతీతత్తడి, చెల్మి బూచులతోడ,
బొల్లి నెమ్మను సంధిల్ల నిట్టి
విభవ మొప్పెడి నిన్ను వేమరువట్టి కొ
ల్వగ బూను నన్ననవలెను గాక
నిన్నన పనియేమియున్నది? శాబాసు!
సాయం సమారంభ చటుల నటన
గీ॥ భ్రమదదభ్ర జటాచ్ఛటా బహుళ భంగ
స్వర్ధునీ ధ్వని ముఖరితాశావకాశ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ పుట్టింప రక్షింప బొలియింప నబ్జ సం
భవుడవై, శ్రీరమా ధవుడవై, భ
వుడవయి యున్నాడ వొక్కఁడ వరయంగ,
నాద్యంత శూన్యుండ వజుడ వాద్యు
డవటంచు దెలియు శుకాగస్త్య శౌనక
దూర్వాస కౌశికాదులకు గాక
వశమె యస్మాదృశ కృశమనీషుల కెన్న?
పటహా భూరి ధ్వని స్ఫాయ దుత్క-
గీ॥ టార్భటీ ఘోర కహకహా కాట్టహాస
ఘోర నిర్భిన్న బ్రహ్మాండ కుహర దేశ!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ మనుప జేజేలలో మంచి దేవరవంచు
ముదురు చదువు తుదల్ మొరసె ననుచు
పెద్దల సుద్దులు తద్దయు బాటించి
సేవింప వంచన చేసి నన్ను
గనవయ్యయో యింత కఠినంబు బూనుట
కేది గతంబొ నే నెరుగ నలిక
దృగ్విష్వగుచ్ఛల ద్వీతిహోత్ర స్ఫాయ
దుత్కట విస్ఫులిం గోగ్ర హేతి
గీ॥ చక్రదీప వపుః పుష్ప చాప భూతి
ధామ దిగ్వ్యాప్తఘ భాస్వ దుద్యద్దినేశ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ రక్షింపవే నన్ను రాజరాజ వయస్య
శశిధర త్ర్యక్ష పంచాస్య యనగ
పోషింపవే నన్ను భుజగేంద్ర కంకణ
ఫాలదృగ్జిత పంచబాణ యనగ
పాలింపవేనన్ను పార్వతీ ప్రియధామ
చూడామణీకృత సోమయనగ
కరుణింపవే నన్ను కమలాప్త శశినేత్ర
భవ మహార్ణవ యాన పాత్రయనగ
గీ॥ విషము దిన్నట్లు పలుకవు వినవు మనవి
స్థాణునామము నిజమయ్యె స్వామి నీకు!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ తత రత్న కాంచనాంచిత సౌధములకంటె
విహితమా ప్రేతభూ విహరణంబు?
మంజుల మణిమయ మంజీరములకంటె
చిత్రమా భుజగ మంజీర చయము?
మవ్వంపు మేల్ జరీ దువ్వాల్వకంటెను
మృదులమా మువ్వన్నె మెకముతోలు?
నలువైన నడల జెన్నారు వార్వముకంటె
గౌరవమా వెలి గబ్బి గిబ్బ?
గీ॥ భక్తు లడిగిన లేదను పనికి వల్ల
జేసికొనబూని యీవేస మేసితౌర!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ పల్లకి లందలాల్ బాబాలు నడుగంగ
నెరుగనే నీ పెద్ద నెక్కుచుంట!
చీని చీనాంబరాల్ జిల్గు శాల్వాలు గోర
చూడనే మొలతోలు చుట్టుచుంట!
మురుగులు సరిపెణాల్ మురిడీలు యాచింప
కానవే పాముల బూనుచుంట!
భక్ష్యముల్ భోజ్యముల్ పానీయముల్ వేడ
వినియుండనే నీవు విసము దినుట!
గీ॥ వెఱ్ఱినే నిన్నెరింగియు విత్త మడుగ,
చాలు నీ భక్తి స్థిరముగా సంఘటింపు!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ మణిగణ విభ్రాజమాన కూటము మామ,
కాంచనా హర్మ్యంబు కార్ముకంబు,
రాజతాద్రియె గీము, రాజరాజు సఖుండు,
సన్నపూర్ణ ప్రియ యమృత వాపి
దీర్ఘిక యుపవని దేవతాగమ వాటి,
కామధేనువు దొడ్డి గల్గు గిడ్డి,
నైన లోభితనాన నవి వాడుకకు దేక
బువ్వ బిచ్చాలును పొట్టనింపి
గీ॥ కాల మీరీతి కష్టాన గడపుచున్న
నిన్ను జేరిన నా వెఱ్ఱి నెన్న వేల?
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ శ్రీశైలపతితోడ జెప్పునేమో యని
 వెల్లికైనను నీవు వెరవవైతి!
భీమేశ్వరుని తోడ బ్రేలునేమో యని
 నాడికకైనను నోడవైతి!
అవిముక్తపతితోడ నాడునేమో యని
 కొదువకైనను నీవు నదలవైతి!
గోకర్ణనాథుతో గొణుగునేమో యని
 నక్షికైన నీవేమి జడియవైతి!
గీ॥ వహావా! ఏమైనగాని నీ వరసి నన్ను
సాకలేవైతివని నిన్ను చాటువాడ!
భూతలోకేశ! ఆచంట పురనివేశ!
భావభవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ నిన్ను సేవింపక మున్ను నరుండన్న
 మంశుకమారామ మాలయంబు
నామయా భావమా నంగంబు గలిగియు
 నన్యమెరుగక యహర్నిశంబు
సేవించి భిక్షుడై చీర గట్టగలేక
 కాటిబ్రేవల వెట్టిగా జరించి
గుట్టమెట్టలవెంట గూడి మేనరవెల్ల
 దనమొంది దలమేరు దనరుచుండ
గీ॥ తుదిని నినుగొల్వ దొరకొను పదవిది గద!
బళిర నీ భక్తసముదాయ భాగ్యమహిమ!
భూతలోకేశ! ఆచంట పురనివేశ!
భావభవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ కూరిమి మీరంగ కూతు నాలిగ జేసె
కొడుకును రథ -చోదకునిగ జేసె
మామ నమ్ముల పొదిగా ముదమున జేసె
దారను రథముగా దనర జేసె
బావనన్నను తేరి బండ్లుగా నొనరించె
తాను శిలీముఖతను వహించె
నట్టి మిత్రుని పుత్రు నభినవాకారు నీ
కంటి మంటలచేత గాల్చినట్టి
గీ॥ కఠిన పాకివి దయజూడ గలవె నన్ను,
గలయ గతిలేక నిన్ గొల్వ వలసెగాక!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ! 80

సీ॥ పుణ్య జనాత్యయ స్ఫూర్తి నీ వంటివా
పుణ్య జనాత్యస్ఫూర్తి నీవు!
బ్రహ్మ హత్యాక్రియా పరుడ నీవంటివా
బ్రహ్మ హత్యాక్రియా పరుడ నీవు!
పరదార సంగతి ప్రబలుడ వంటివా
పరదార సంగతి ప్రబలుడీవు!
మఘ వినాశక్రియా మతివి నీ వంటివా
మఘ వినాశక్రియా మతివి నీవు!
గీ॥ అరయ స్వామీవసేవకో యనెడు సూక్తి
గలుగనే నన్ను దాసుని గాగ నేలు!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ "శివ! శివ" యని నిన్ను జింతన చేసిన
పాప సంఘంబులు పాపవేల?
"హర! హర" యని నిన్ను నార్తి భజించిన
తాపత్రయంబుల మాపవేల?
"భవ! భవ" యని నిన్ను బ్రస్తుతి చేసిన
కలుష సంఘంబుల గాల్చవేల?
"మృడ! మృడ" యని నిన్ను మ్రొక్కి సేవించిన
దుఃఖ సంతతులను దునుమవేల?
గీ॥ కలిమి దయచేయుటకు నీకు కష్టమైన
నింత మాత్రము చేయ నీ కేమి కొరత?
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ మోహ వశంబున ముని దారలనుగూడ
దారుకా వనముకు దారినావొ?
భక్తి భావము మది బరికింపగా గోరి
కరమర్థి భల్లాణు గదిసినావొ?
చతురత నెరుకల సానివై గట్టు రా
పట్టికై వలిమల మెట్టినావొ?
పర గర్వ వృక సుర వైరి కేల్గవ తల
పై పెట్ట గమకింప బారినావొ?
గీ॥ గాని రజతాద్రి నున్నను గానరావె?
భో! మహాదేవ! దేవ! శంభో! యటన్న,
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ ఏ నీ పదాంబుజం బింద్రాది సురశిరో
రాజిత రత్న నీరాజితంబు!
ఏ నీ స్ఫురన్నామ మినజఘోరాకార
దారుణ కింకరోత్సారణంబు!
ఏ నీ పరాక్రమం బిభ దానవోత్తాల
భయదాపఘనవన పావకంబు!
ఏ నీ దయాలోక మిందిరా సుందరీ
సుందరేందిందిరా ళిందకంబు!
గీ॥ అట్టి నీ యందు నా మన మనవరతము
మరులుకొన జేసి బ్రోవవే! మదన హరణ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ ఆమ్నాయములు మహదాదులు మాతృకల్
సనకాది మౌనులు సన్నుతింప,
మందార వనిక్రేవ మహితామృతాపగా
ప్రాంతమూలూర వనాంతరమున
దినకరాజ్ఞానల దీప్తి తిరస్కార
రుచిర రత్న చిరత్న రచిత సౌధ
తల ఘనకాంతి చింతారత్న కోత్సేధ
పీఠపై సుమగూడి పేర్మిమీర
గీ॥ నిశ్చలానంద నిర్భర నిత్యభూతి
వెలుగు నీ వేడ నా మొర వినుటలేదు!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ వనజ నయన హిత వహ మునిజన నుత!
భుజగ కటక శివ రజత శిఖరి
నిలయ! ధనద సఖ! లలిత తనురుచి వి
జిత దరదరకర వితత చరిత!
నిగమ హయ హార ఫణిగుణ వృష గమన!
కమలహిత శిశిర కరక నయన!
విమత గజ దనుజ విదళన చణ హిమ
కర ధర! నగధర శరసుశరణ!
గీ॥ సతత హిమగిరి శిఖర కలిత విహారణ
వటవిటపి నికట నిలయ! వరద! గిరిశ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ గణపతి సేనాని కాలభైరవ వీర
భద్రులు నల్వురు భద్ర యశులు
సుతులు నీకై దవ సుతునిగా గాచి ర
క్షింపు మంచును నిరీక్షించియుండ
గణపతిత్వము, దేవ గణపతిత్వము, కాశి
కాపతిత్వము, సర్వ గణపతిత్వ
మొనర నిచ్చి యుమేశ గన్వై తి వహహ నా
దీనత్వ మగజకు దెలుపుమయ్య!
గీ॥ పెద్ద కొడుకులపై ప్రీతి పెద్ద తండ్రి
కన్న సామెత నిజమాయె నెన్నిచూడ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ పాతక వ్రాత జీమూత వాతూలంబు,
దారిద్ర్య దవ వహ్ని వారిదంబు,
తీవ్ర దుస్సహ దుఃఖ తిమిర ప్రభావంబు,
భవ మోహ సాగర బాడబంబు,
భక్త కామిత ఫల పారిజాత నగంబు,
యోగి సంతాన భాగ్యోదయంబు,
కాల కింకర గర్వ కరి మృగరాజంబు,
సేవకజన మీన జీవనం బ
గీ॥ నంగ దనరారు నీ పాద నలిన యుగళ
మస్మదీయ హృదంభోజ మందు నిలుపు!
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ అవ్యక్తు, నచలు, ననంతు, ననామయు,
నక్షయు, నవికారు, నద్వితీయు,
నజు, నప్రమేయు, ననాదినిధను, నాఢ్యు,
నజితు, నతీంద్రియు, ననఘు, నమలు,
నక్షయు, నాదిమధ్యాంతశూన్యు, నసంగు,
నకలంకు, ననుపము, నజరు, నాద్యు,
నమర ధనాకారు, నాగమసంవేద్యు,
నఖిల కారణు, మృడు, నాదిదేవు,
గీ॥ నిన్ను భజియించి, బుధులు నిర్నిద్ర భక్తి
పొందుచుందురు కైవల్య భూరి సుఖము!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ నిర్గుణు, నిరవద్యు, నిగమాంత సంవేద్యు,
నీరజాక్ష ప్రియు, నిరుపమాను,
నీరధి తూణీరు, నిర్జితాసురవీరు,
నిత్యు, నిరంజను, నిష్కలంకు,
నిష్కలు, నిష్కాలు, నిర్వికల్పు, నిరీహు,
నిష్కాము, నిశ్చలు, నిర్వికారు,
నిర్జర సంసేవ్యు, నిర్ణిద్ర మహిమాఢ్యు,
నీరజభవ నుతు, నిఖిల భావ్యు,
గీ॥ నిన్ను గొల్వంగ నేరని నీచమతులు,
అవ్యయానంద పదమున నలరగలరె?
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ! 90

సీ॥ సకల పాపౌఘ నాశకమైన భవదీయ
నామ స్మరణ కీర్తనమ్ము వలన
విముఖులై కామ్య కర్మము లాచరించుచు
నష్టమనీషల దుష్టకార్య
రూఢి కర్మ గుణానురూప దేహము దాల్చి
పుత్ర మిత్ర కళత్ర భోగ విషయ
దుఃఖ దుస్సహ పీడ దురపిల్లి కామాగ్ని
తంతప్యమానులై ధర జరించు
గీ॥ మానవులు నీ పదాంబుజ ధ్యాన గరిమ
న్రపతర్క్యాపవర్గము నంద గలరె?
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ నీ మాన్య తత్త్వార్థ నిశ్చిత బోధ క
థా సుధాబ్ధిని నరుల్ దగిలి గ్రుంక
కధిగత వ్యర్థ ప్రయత్నులై కాయ మా
యాసంబు జెందఁగ నఖిల దిశల
గల తీర్థముల నెల్ల గలయ నాడిన యంత
తామస కామ సంధాన దుర్వి
కార మానస భార కలుషంబు వోవునే
బహిరంగ పంకంబు పాయుగాని

గీ॥ నిరుప మాత్మాను సంధాన నిత్య నిర్వి
కార విజ్ఞానమున కంటె గలదె పరము?
భూత లోకేశ! ఆచంట పుర నివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ ఆర్త రక్షణ కళా ఖ్యాత దైవములలో
నధికుండు నీ కంటె నరయ లేడు!
బహుళ విపద్దశా భావితాత్మకులలో
నాకంటె నధికుడౌ నరుడు లేడు!
అధికుల మిర్వుర మరయ పోషక పోష్య
భావంబు గలదు సంబంధ మెన్న,
గాన నన్ రక్షింప గడవని విధి నీకు!
విధి నాకు నిన్ జేరి విడువకుంట!

గీ॥ ధర్మ మిది నాకు నీకును తప్పబోకు
మెంచి డెందంబులోన నూహించుమయ్య!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ కమలనాభుఁడు మృదంగంబు మ్రోయింపంగ,
చతురాననుఁడు తాళ గతుల నెరప,
వాణి విపంచికా వాదనం బొనరింప,
వేల్పురేఁ డరిమురి వేణు వూద,
మునివరుల్ కాహళుల్ ముదమార వాయింప,
సంగీత మిందిరా సతి నెఱపగ,
జేజేలు నటనంబు చెలఁగి యాలోకింప,
విద్యాధరాదులు వినుతి సేయ,
గీ॥ తకట థక్కిట ఝుణుతంచు దాండవమును
సంధ్య వేళ నొనర్తువు సంతతంబు!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ జిహ్వ గల్గు ఫలంబు శివ! శర్వ! భవ! యని
పలుమారు భక్తిని బల్కనేని,
చేతులున్న ఫలంబు శ్రీ మహాదేవ! నీ
చరణ సపర్యలు సలిపెనేని,
శిరము గల్గు ఫలంబు చిత్తజాంతక! నీకు
ముదమార సతతంబు మ్రొక్కనేని,
వీనులున్న ఫలంబు విశ్వేశ! నీ నామ
కీర్తనల్ రతి నాలకించెనేని,
గీ॥ కాని-చో జిహ్వ కర మస్తక శ్రుతులును
వ్యర్థములుగావె? వానికి వసుధ లోన!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ ముందర పురుహూత ముఖ దేవ బృందముల్
జయజ యేతి ధ్వని సందడింప,
దాపల వైకుంఠ ధనదు లాదట నిష్ఠ
గోష్ఠి వినోదంబు కూర్మి నెరప,
సనక సనందన చతురాన నాదులు
వలపల శ్రుత్యుక్తి వాదుసేయ,
కలహాశనుడు మ్రోల కలవల్లకీస్వన
సంగతి సంగీత సరణి జరుప,
గీ॥ కొండ రాచూలితో గూడి నిండు కొల్వు
కూటమునయుందు వార హా! కూర్మిమీర!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ తలనున్న మిన్నేటి తరగల చప్పుళ్ళు
రహిమించు మర్దళ రవముగాగ,
సీవిరుల్ వీచు జేజే వెలందుల మణి
కంకణ ధ్వని తాళ గతులుగాగ,
గౌరీ కరాంచిత కంజ గంధంబాను
తేటి తుటుము మ్రోత పాటగాగ,
తెరగంటి బాసవాల్ దొరమీటు వల్లకీ
కల నినాదం బుపాంగంబుగాగ,
గీ॥ సలయగతి భృంగి నాట్యంబు సలుపు వేళ,
వింత దివిజులతో చిత్తగింతు వార!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ మస్తక లోచన మానసామయ మహా
శూల మేహ జ్వరాభీల కాస
యత్యాశ్మరీ క్షయాద్యములైన రోగముల్
మాన్ప వైద్యుఁడ వీవు మందు భూతి
రౌరవంబును మహా రౌరవంబును మృత్యు
జన్మ జరాదులన్ దున్ము దీవు!
జీవుని బాయంగ జేయు వెజ్జవు! మందు
భూతేశ శర్వ రక్షేతి యనెడు

గీ॥ నుడువె యనుపానముగ నాకు నిడుము నీవు
భక్తి స్థిరమున నద్రిజా ప్రాణనాథ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ కోపమా! లేక నా పాపమా! యిదికాల
లోపమా! నన్నిటు లోఁగజేయ!
అందమా! యిది నీకు చందమా! నా భాగ్య
మందమా! నను శ్రమ నొందజేయ!
భారమా! యిది గ్రహచారమా! నే జేయు
నేరమా! నను సవికారుజేయ!
సీతమా యిది నిజాకూతమా! నిర్ఘృణా
జాతమా! నను దైన్య భీతుజేయ

గీ॥ ఏల! నన్నేల! జాగేల? వేలుపులను
కరుణ గలవారు నీకంటె గలరె యొరులు?
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ శంకర! నీ జటా జాల చంచద్ద్యుతి
ప్రకట హరిద్ర పంకంబు గాఁగ,
కైలాస వాస! నీ కంటి మంటల రంగు
సొగసైన కుంకుమ చుక్క గాఁగ,
కనకాద్రి చాప! నీ కంఠ కాళిమకాంతి
నెరపు కాటుక రేఖ నీటు గాఁగ,
గోరాజ గమన! నీ కొమరొందు మైచాయ
సిరిమించు వెలిపట్టు చీర గాఁగ,
గీ॥ నలర గైజేసికొని గొల్చు నతివ లనఁగ,
తెలివి జెన్నొందె నౌర! విదిశలు దిశలు!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ! 100

సీ॥ కాంచనాహార్యంబు కార్ముకంబుగ జేసి,
కుండలిరాజును గుణము జేసి,
చంద్ర భాస్కరులను చక్రముల్గా జేసి,
రాజీవభవుని సారథిగ జేసి,
అంబుజనాభుని నంబకంబుగ జేసి,
రత్నగర్భను పటు రథము జేసి,
ఆమ్నాయములను వాహనములుగా జేసి,
తోయధీశుని యంప దొనగజేసి,
గీ॥ నీవు రథికుడవై పేర్మి నిగుడ మెరసి,
త్రిపురముల గూల్చితౌ! నొక్క దెబ్బలోన!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ సుర మహీరుహా గేహా! సుందరతర దేహా!
పన్నగరాడ్భూష! భక్తపోష!
శీతశైల విహార! సింధురాజ గభీర!
పుంగవేశ తురంగ! మంగళాంగ!
ముని జన వన చైత్ర! మోహలతాదాత్ర!
వందారు గీర్వాణ వనధి తూణ!
కాంచనాచల చాప! కమనీయతర రూప!
విశ్వంభరాధార! వేదసార!
గీ॥ దివ్య మునిజన సన్నుత! దేవదేవ!
శ్రవణ మంగళతరనామ! సల్లలామ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ జాలంధరాటోప శైలరాడ్దంభోళి!
ద్వీపయామినీ చర తిమిర హేళి!
అంధకాసుర విగ్రహారణ్య దవకేళి!
స్మరయశశ్చ్రకాంగ జలదపాళి!
పుర నిశాచర బల ముదిర ఘోర సమీర!
కాలావలేపద్రు ఘన కుఠార!
దుంధుభితమ మిత్ర! దోషలతాదాత్ర!
చటులాగ్నికృన్నేత్ర! జాతిచైత్ర!
గీ॥ దీన జన కల్పపాదప! దివ్యపాద!
భక్త చింతామణి స్ఫురద్భవ్య వీక్ష!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ శ్రేయును బవ లొక్క రీతిని దీపించు
శశిబింబ మననొప్పు సతి మొగంబు,
పగలు రాతిరి నొక్క భంగిని వికసించు
కంజాతయుగ మింతి కన్ను దోయి,
వాడక యెప్పుడు వాసన గలిగిన
నీలోత్పల సుమంబు నెలత మేను,
మేల్మి బంగరు చాయ మెరయు మదేభేంద్ర
కుంభ ద్వయము కల్కి కుచ యుగంబు,
గీ॥ అవికులమునకు గురువగు నతివ కుచము
లిట్టి గిరి సుత కర్ధాంగ మిచ్చి తౌర!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ భవ విమోచన సూత్ర! పావన చారిత్ర!
భావుకగాత్ర! తుభ్యం నమోస్తు!
మహనీయతర వేష! మంజులామృత భాష!
పన్నగ భూష! తుభ్యం నమోస్తు!
వందారు మందార! వననిధి తూణీర!
పాతక దూర! తుభ్యం నమోస్తు!
శ్రుతి చతుష్టయ ఘోట! శుచినయన లలాట!
పదనమత్ఖేట! తుభ్యం నమోస్తు!
గీ॥ అనుచు నాతత భక్తిని నతుల గతుల
నతు లొనర్చెద నీ పాద నలినములకు!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ కాశ్యపీ కామినీ కమనీయ ముఖపద్మ
ముక్తాలలంతికా స్ఫురిత మయిన
యాచంట పురమున నంఘ్రిజాతాన్వయ
మహిత మేకా వంశ మౌక్తికాయ
మాన నాగయ్య ధీ మణికిని చల్లమాం
బకు నగ్ర వర తనూభవుడ నైన
దేవావనీ దేవ పావన పాదరా
జీవ సేవా జీవ జీవితుండ!

గీ॥ బాపనాఖ్యుడ! తావక పాదభక్తి
తోడ నర్పించితిని సీస శతక మిదియు!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ శాలివాహన శక సంవత్సరములలో
ఘనగిరి శైలేందు సౌమ్యవర్ష
భాద్రపదాసిత షష్ఠ్యష్టమీ సోమ
వారమునను భవద్దర్శనమున
పుట్టువు సఫలత బొందింప దలచి నే
సీస శతంబు రచించినాడ
నెందాక భాస్కర హిమకర తారకా
కరి హరి గిరి కిరి కమఠ ధరలు

గీ॥ దరలకుండెడు నందాక తావకీయ
కరుణ నిది యొప్పు గాత! సత్కవుల సభల!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ!

సీ॥ విన్నప మాలించు! విశ్వేశ! సర్వేశ!
విశ్వోద్భవ స్థితి విలయ కరణ!
ఆచంట పురమున నంగనా స్తనలింగ!
విఖ్యాతి వెలసిన వేల్ప! భక్తి
నీ కర్పితంబుగ నే రచియించిన
సీస పద్య శతంబు చిత్తగించి,
రహి విన్న, జదివిన, వ్రాసిన వారికి
ధన ధాన్య వాహన దంతిధామ
గీ॥ పుత్ర మిత్ర కళత్ర విస్ఫూర్తి పరమ
పదవి దొరకొన జేయవే! పార్వతీశ!
భూత లోకేశ! ఆచంట పురనివేశ!
భావ భవనాశ! రామేశ! పార్వతీశ! 108

ఆచంట రామేశ్వర శతకము
సంపూర్ణము.



# సర్వేశ్వర దండకము

(భక్తశిఖామణి ఒడయనంబి విరచితము)

శ్రీమద్భవానీశ! రామేశ! మృత్యుంజయా! దేవ! సర్వేశ! లోకేశ! భూతేశ! నాకేశ! యక్షేశ! బృందారకవ్రాత మౌనీంద్ర! సద్భక్త చింతామణీ! ధీమణీ! చండమార్తాండ చంద్రాగ్ని నేత్రా! నభఃకేశ! విశ్వేశ! నాదస్వరూపా! విరూపాక్ష! కారుణ్య వీక్షా! శివాపేక్ష! సాకార దివ్యప్రచారా! నిరాకార! సంసారదూరా! బుధాధార! బ్రహ్మాండభాండాళి సంరక్ష సత్కార్య నిర్వాహకా! సర్వలోకోపకారీ! జగద్వ్యాప్త కీర్తీ! సదా నిన్ను ధ్యానించి, నీ దివ్య కారుణ్యముల్ బొందగా గోరి, నే సర్వ తీర్థంబులన్, సర్వ యాత్రాస్థలుల్ సర్వమున్ భక్తితో జూచి, సర్వాపగాసీక సుస్నానముల్ జేసి, కాలుష్యముల్ నాశమొందంగ నీరీతి నీసట్టణాంబందు, సద్భక్తియుక్తంబుగా నిన్ను బూజింప యత్నించి, గాలింపగా నాచి యత్యద్భుతంబంది, నీ సుప్రభావంబు కన్పట్టగానెంచి, నిన్ జూడ గోరంగ, భక్తాళి సంరక్షకుండౌటచే దర్శనంబిచ్చి, మా వాంఛితంబొప్పగా నీవు నీడేర్చి నాపైంక మా కోరికల్ దీరె, బాహ్యాంతరవ్యాపకా! దివ్యతేజః ప్రభావా! సుభక్తానువర్తీ! మహాదేవా! నమస్తే! నమస్తే! నమస్తే! నమః॥